# భగవద్భక్తాంఘ్రిమంజరి

1687
1132

## వేదాంతగ్రంథమాల




# భగవద్గీతార్థమంజరి.

ఇది

శ్రీ భగవద్గీతాతాత్పర్యము సకల జనులకును

సులభముగ తెలియునట్లు

నెల్లూరియొద్ద కోవూరిలోనుండు

కోవూరి పట్టాభిరామయ్యచే

రచియింపబడి

నెల్లూరిలోనుండు వైశ్య ముద్రాక్షరశాలలో ముద్రించబడి

ప్రచురించబడియె

1918 సం॥రం.

దీనివెల 2 అణాలు మాత్రము.

శ్రీరామ.

# శ్రీ భగవద్గీతార్థమంజరి




శ్రీకరంబగు కురుక్షేత్రభూమియందు

భారతసేనలు బారులుదీరి। 1

శంఖభేర్యాదిఘోషము మిన్నుముట్ట

కడగి కయ్యానికి కాల్ద్రవ్వుచుండ। 2

తెల్లనిగుఱ్ఱాల తేరుపైనెక్కి

క్రీడివిల్కాని శ్రీకృష్ణునిజూచి। 3

ఉభయసేనల మధ్యనుంచుము తేరు

వచ్చినశూరుల బాగజూచెదను। 4

అనియట్లు కావింప నర్జునుండచట

తండ్రుల తాతల తనుజుల గురుల। 5

మామల మేనమామల నాత్మసఖుల

అన్నల దమ్ముల నాప్తుల జూచి। 6

ఇందఱిజంపి నాకెందుకు జయము

నెత్తురుకూడిది నేనొల్లకృష్ణ। 7

రాజ్యలోభమున కౌరవులు చంపినను

చచ్చెదగాక నే జంపనువారి । 8

నని పాపభీతిచే వ్యాకులపడుచు

విల్లునమ్ములు క్రిందబెట్టి కూర్చుండె । 9

అప్పుడు శ్రీకృష్ణుడనియె నోపార్థ

పిఱికివైతివిదేల విషమకాలమున । 10

తగదునీకిది లెమ్ము ధైర్యంబుబూను

ఉభయలోకముల బూజ్యుడవౌదువనిన । 11

పూజ్యులౌ ద్రోణభీష్ముల జంపి కులము

పోకార్చి రాజ్యంబు పొందుటకంటె । 12

బిచ్చమెత్తుచు మునివృత్తి నుండుటయె

మేలుగాదే యోటమియు గెల్పు నిజమె । 13

కార్పణ్య దోషంబుగాఢమై ధర్మ

మెఱుగ నీశిష్యుడ నెది నాకు మేలో । 14

నిశ్చయించివచింపు నిన్నెనమ్మితిని

నాశోకముడుపవే నాప్రభుకృష్ణ । 15

తెలనవ్వుమోమున నిగుడింపవిజయు

నీక్షించి యర్జునా యెఱుగవేమియును । 16

ఎఱిగినట్టులె వచియించెదుగాని

దేహి దేహేంద్రియాతీతుం డజుండు । 17

నిత్యు డసంగుడు నిర్వికారుండు
దేహంబు తెగినను తెగ డవ్యయుండు । 18

దేహం బనిత్య మస్థిరము నసత్తు
శైశవాదులయందు జాగ్రవాదులను । 19

మారునీ దేహంబు మారదు దేహి
దేహముల్ విడుచుట దేహికి ప్రాత । 20

చీరలువిడిచి మంచివితొడ్గునట్లు
దేహి దేహంబుల తీరిట్టులెఱుగ । 21

చంపితి నే నీవు చచ్చెనాచేత
నను టెల్లకల్లగా నగపడకున్నె । 22

ద్రోణభీష్మాది యోధులు మేనులైన
చచ్చినవారిని చంపెదవంతె । 23

వారాత్మలైన నవధ్యులుగాన
వారినిజంప నీ వశమే కిరీటి । 24

నీధర్మమునుజూడు నీకీర్తి చూడు
గెల్చిన రాజ్యంబు కిట్టిన దివము । 25

ధ్రువమనిమదినమ్మి దుఃఖంబుసుఖము
లాభంబునష్టంబు లగ్గునునెగ్గు । 26

సమముగావలపోసి సమరంబొనర్చు

నిను పాపమంటదు నిజము నామాట । 27

బుద్ధియుక్తుండవై మోహంబు బాసి

కర్మఫలంబుల కాంక్షించుమాని । 28

చేయనౌ కర్మంబు చేసితివేని

జన్మబంధంబుల చయ్యనవిడుతు । 29

ఇదియె జీవన్ముక్తి యిదె కర్మయోగ

మిదియె మోక్షద్వార మిదె రహస్యంబు । 30

చేసియు చేయక చేయక చేసి

యీరెండిటిని బాసి యొప్పెడువాడు । 31

వాడే మహాయోగి వాడె నేశాలి

కర్మంబు తానెంతగా జేయుచున్న । 32

అనియొక్కచలుసైన నంటదాతనిని

కాన యోగంబున కర్మముల్ ద్రోసి । 33

జ్ఞానంబుచేత సంశయముల బాసి

యుద్ధంబునకు లెమ్ము యోగివై పార్థ । 34

అనవిని నరుడు నారాయణుతోడ

కర్మసంన్యాసంబు కర్మయోగంబు । 35

ఈ రెండు జెప్పితి వీ రెంటిలోన

నేదిమేలో నిశ్చయింపవే దేవ । 36

అనుటయు మోక్షదాయకములే రెండు
ఇవి వేఱుగానెంతు రెఱుగనివారు । 37

సంకల్పముల నణచగలేని యోగి
యోగయుక్తుఁడుగాక యుండు సన్న్యాసి । 38

యీయుద్దేశము వ్యర్థ లేదిచేసినను
రెండింటిఫలమబ్బు రెండింటిలోన । 39

ఒక్కింతమేలగు యోగమేసున్ను
మనసు సమస్థితిమంచిదికాదె ? 40

ఆస్థితి నొందుటెట్లన్న చెప్పెదను
వెలివిషయంబుల వెలుపలవిడిచి । 41

భ్రూమధ్యదృష్టివై ముక్కులలోన
సమముగానడుపుము శ్వాసనుబట్టి । 42

మోక్షంబుగోరుచు బుద్ధిమనసు
నింద్రియంబులను పోనీయకనిలుపు । 43

కోరికజంకును క్రోధంబుమాను
ఇదియెమనశ్శాంతి నిచ్చెడిత్రోవ । 44

మనసు శాంతంబై సమస్థితినొందు
సతతము సమాధి బ్రహ్మంబయియుండు । 45

కావున నొంటి నేకాంతస్థలమున

శుచి యబాధకమగు చోట నిశ్చలత । 46
తనువెత్తు తనుతగ్గు గాకుండునట్లు
ముందు కుశాజినంబులు గుడ్డ బఱచి । 47
సమముగా కాయశీర్ష గ్రీవములను
నిక్కించి కూర్చుండి నిలిచి నాసాగ్ర । 48
వీక్షించుచును దిక్కు లీక్షింపకుండి
చిత్తేంద్రియ క్రియల్ చిక్కంగబట్టి । 49
మనసు నాపై నిల్పి మఱువక నన్నె
తలచుచు నభయవ్రతంబున యోగి । 50
సేవ నిత్యము జేయు సిద్ధించు నదియు
గాలివీవని చోట కదలని దీప । 51
కళికపోలిక వెల్గు ఘనయోగిచిత్త
మాగి నాత్మ లీనమై యుండునపుడు । 52
చింతలేవియు బుట్టి చిత్తంబు నెలికి
జాఱకుండగ ధైర్యశాలియై యోగి । 53
అల్లన బుద్ధిచే నణచగావలయు
ఇదివాసుదేవు న న్నెఱిగెడి తెఱగు 54
అనవిని యర్జునుం డనియె నో దేవ
గాలినైనను నిల్పగావచ్చుగాని । 55

మనసుచాంచల్యంబు మాన్పగా దరమె

అదినిల్పుటే యోగమంటివినీవు । 56

యోగసిద్ధిని పొందనోపక జాతి

నట్టివా డేగతి నందునోచెపుమ । 57

రెంటికిజెడినట్టి రేవణయగుచు

చెడిపోవునోయని చింతింతుననిన । 58

ముదమున శ్రీకృష్ణమూర్తి యిట్లనియె

వైరాగ్యమునను నభ్యాసంబువలన । 59

మనసు నిల్పగవచ్చు మానవుం డపుడు

చలియించి యోగంబు సాధించలేక । 60

భ్రంశగెనేనియు వాడు పుణ్యలోకముల

చాలకాలము దివ్యసౌఖ్యంబులొంది । 61

మరల శుద్ధులును శ్రీమంతులు యోగు

లగువారికులములయందు జన్మించు । 62

అట్టిదుర్లభతరంబైన జన్మమున

పూర్వవాసన సిద్ధి బొందునంతకును । 63

యత్నించు;వా డింద నందును జెడడు

పుణ్యుండు దుర్గతి బొందునా తండ్రి ? 64

జ్ఞానులకన్నను కర్ములకన్న

తపసులకన్న నుత్తముఁడయ్యె యోగి । 65

కావున యోగివి కావలె నీవు

అందఱుయోగులయందును నెవఁడు । 66

చిత్తము నాయందు స్థిరముగాఁ జేర్చి

ననుభజించునో వాఁడు నా కతిప్రియుఁడు । 67

ఇట్టివారలు భూమి నెంతయు నరుదు.

విజ్ఞానయోగంబు వివరింతు వినుము । 68

పరయన నపరనా బఱగు నాప్రకృతి

భూతపంచకమనో బుద్ధ్యహంకృతులె । 69

యపర రెండవది జీవాత్మకమ్ము

ఈ రెండురూపుల నే విశ్వమెల్ల । 70

ధరియింతు భూతసంతతు లిందెపుట్టు

జగమెల్ల నాయందె జనియించు నణఁగు । 71

నాకన్న నన్యంబు నలుసైన లేదు

దారంబు మణుల కాధారమైనట్లు । 72

ఈజగంబున కెల్ల నేనె యాదరువు

ధరసువాసన నీటఁద్రవ మగ్నిసెగయు । 73

చదలశబ్దము రవిచంద్రులవెలుగు

ప్రాబల్యము లందెల్ల ప్రణవంబునేను । 74

అఖిలభూతముల జీవాత్ముడనేను
సకలంబునందుండు సారంబు నేను। 75

సాత్త్వికంబులు రాజసములు తామసము
లగునునావలన నాయందవియుండు। 76

వానిలో నేనుండ వాస్తవం బెఱుగు
ఈత్రిగుణాత్మకయే నాదు మాయ। 77

దీనిచే భ్రమనొంది తెలియరు నన్ను
నన్నెదిక్కనికొల్చు నాభక్తజనులు। 78

దక్కనన్యులు దీని దాటగాలేరు
మూఢులుపాపులు పొందరునన్ను। 79

ఆర్తుండు జిజ్ఞాసు వర్థార్థి జ్ఞాని
ననుగొల్తురందఱు నామెచ్చువారె। 80

ఐనను జ్ఞాని నా కధికప్రియుండు
ఇదియెల్ల నేనని యెఱుగువాడగుదు। 81

ఎవ రేమికోరి న న్నెట్లు కొల్చినను
అదివారికగ్లె నే నమరింతు గాని। 82

తమ జరామరణబంధము బాపుమనుచు
ననుగొల్చువారె పూర్ణబ్రహ్మవిదులు। 83

అవసానకాలమం దంతరంగమున

ఏమితలంచుచు నేగునో నరుడు । 84

దానిభావము వానితలపున నిలిచి

వాని కాజన్మమే వారక యిచ్చు । 85

కాన నన్నెంచుచు కాయంబువాయు

వాడు తప్పక నాదుభావంబు నొందు । 86

అట్లౌటనన్నె నిత్యము మది నెంచు;

అంత్యకాలమునందు ద్వారంబులెల్ల । 87

అరికట్టి మనసు హృదంతర్గతముగ

జేసి ప్రాణము పైకి చేది కుంభించి । 88

మొదట కోమంచు నన్నెంచుచు తనువు

పాయువా డేగు నా పరమమౌ గతికి । 89

అన్యులు కర్మపాశాబద్ధులగుచు

రాకపోకలుగల్గి భ్రమియింతురెపుడు । 90

జగమున నే నగోచరుడనై నిండి

యుందుదు నాయందు నుండు భూతములు 91

అరయగా భూతంబులందు నే లేను

ఆభూతతతులు నాయందును లేవు । 92

అఖిలభూతములు నాయందుండునెల్ల

వాయువాకసమున వ్యాపించినట్లు । 93

భూతములు ప్రకృతిలో బొడము నడుంగు
ప్రకృతికిపరుడ నీశ్వరుడ నిస్పృహుడ । 94

నన్నెఱుంగక మూఢనరులు మానవుని
గా దలంతురు మోఘకర్ములు జడులు । 95

అఖలకారణకారణాత్మునిగాగ
నను మహాత్ము లెఱింగి జ్ఞానయజ్ఞమున । 96

వేఱుగా నొకసిగా విశ్వరూపునిగ
చింతించి కీర్తించి సేవించుచుంద్రు । 97

యజ్ఞముల్ క్రతువులు హవ్యకవ్యములు
మంత్రంబు లగ్ని హోమంబును నేనె । 98

జగమునకెల్లను స్రష్టను నేను
తల్లిని తండ్రిని తాతను నేను । 99

వేద్య మోంకారంబు వేద ల్నునేను
భర్తను సాక్షిని ప్రభువును నేను । 100

సదసత్తులును నేను సర్వంబు నేను
నన్నె చింతించుచు నన్నె భజించు । 101

ఘనయోగిజనుల యోగక్షేమములను
నే నవరింతు నిర్నిద్రత నెపుడు । 102

పత్రమో పుష్పమో ఫలమో జలంబో

యేదేని భక్తితో నేవను నాకిచ్చు। 103

వానిపై ప్రీతితో వాడిచ్చుదాని

నారగింతుననే సమాదరంబునను। 104

నీచేయుపనియును నీభుజించునది

నీవేల్చునదియును నీవిచ్చునదియు। 105

నీచేయుతపమును నిత్యంబు భక్తి

నాకునర్పింపు బంధములెల్లబాయు। 106

సర్వభూతంబులు సమములే నాకు

ఐనను నాభక్తులందు నేనుందు; 107

ఎంతదురాచారుడే యైనగాని

నన్నెదిక్కని భజనము నేయువాడు। 108

సాధువేయని యెంచజను చెడండతను

శాంతినొందును దురాచారంబులుడిగి 109

మఱియు నీపైనభిమానంబుప్రీతి

చెప్పెద నొక్క విశేషంబు వినుము। 110

దేవతల్ ఋషులు నాదివ్యమా మహిమ

మెఱుగరు వారికి నే మూలమగుట। 111

అజుడు ననాది మహా ప్రభుం డనుచు

నన్నెఱింగినవాడు జ్ఞాని శుద్ధుండు। 112

భూతంబుల వెలుంగు బుద్ధియు తెలివి
యమములు నియమంబు లభయంబు భయము
సుఖము దుఃఖము యశస్సును నయశస్సు
పుట్టు నావలననే పూర్వపుఋషులు । 114
మనువులు ప్రభవించి మనిరి నావలన
వారిసంతతియె యీప్రజలెల్ల జగతి । 115
తగ నావిభూతివిస్తార మీరీతి
నెఱుగు యోగులు చిత్తవృత్తి నాయందు 116
బెట్టి నామహిమంబు వివరించుకొనుచు
ప్రీతితో తృప్తితో క్రీడింతు రెప్పుడు । 117
అట్టిభక్తుల చిత్తమంద నేనిలిచి
జ్ఞానదీపమున నజ్ఞానతమంబు । 118
వారించి నన్ను జేర్పగజాలు బుద్ధి
యోగంబు వారల కొసగుదు కృపను । 119
అనవిని యర్జును డతిహర్షమొంది
నీవు బ్రహ్మంబవు నిత్యశుద్ధుడవు । 120
దివ్యమూర్తి వటంచు దేవర్షిముఖులు
చెప్పగా విందు నీచెప్పుటేగాక । 121
తత్త్వమింతయు దేవ దానవులెఱుగ

రఖిలాత్మ నీ విభవాతిశయంబు । 122

వివరంబుగా విన వేడుక పుట్టె

వర్ణింపవే నీదు వాక్యామృతంబు । 123

అనవిని భగవంతు డనియెనో పార్థ

నాదివ్యమహిమంబునకు తుదగలదె । 124

ఘనను నడిగితివని సంగ్రహముగ

వర్ణింతు వినవయ్య వాసవతనయ । 125

అఖిలభూతహృదంతరాత్ముండ నేను

భూతాదిమధ్యాంతములు నేనె సుమ్ము । 126

ఆదిత్యులను విష్ణు వనువాడ నేను

జ్యోతిర్గణములోన సూర్యుండనేను । 127

చుక్కలలో హిమాంశుండనునేను

వేదంబులను సామవేదంబు నేను । 128

సకలదేవతల వాసవుడను నేను

ఇంద్రియంబులలోన నేను మనస్సు । 129

రుద్రులలో శంకరుండను నేను

వసువులలోన పావకుడనునేను । 130

అద్రులలోన హేమాద్రినినేను

సరసులలో మహా సాగరంబేను । 131

ఋషులలోనెల్లను భృగువునునేను
వాక్కులలోపల ప్రణవంబు నేను। 132
యజ్ఞంబులను జప యజ్ఞంబునేను
పాదపంబులను నశ్వత్థంబునేను। 133
అశ్వంబులం దింద్రునశ్వంబు నేను
దంతులం దైరావతంబును నేను। 134
నరులయందెల్లను నరపతినేను
ఆయుధంబులను వజ్రాయుధంబేను। 135
ధేనువులను కామధేనువు నేను
ప్రజల బుట్టించు దర్పకుడనునేను। 136
వ్యాళంబులందెల్ల వాసుకినేను
నాగులలోన ననంతుండనేను। 137
అసురులలోన ప్రహ్లాదుండనేను
మృగములలోన మృగేంద్రుండనేను। 138
పక్షులలోన సుపర్ణుండనేను
నదులలోనెల్ల జాహ్నవి గంగనేను। 139
విద్యలలో బ్రహ్మవిద్యనునేను
సృష్టిని హరియించు మృత్యువునేను। 140
పుట్టెడు వారల పుట్టువునేను

స్త్రీల కీర్తియువాక్కు సిరియునునేను। 141
స్మృతి మేధ క్షమ నేను ధృతియునునేను
సామంబులను బృహత్సామంబునేను। 142
అన్నిఛందముల గాయత్రియే నేను
మార్గశీర్షమునేను మాసంబులందు। 143
ఋతువులందు వసంతఋతువును నేను
సాత్త్వికులందలి సత్త్వంబు జయము। 144
వ్యవసాయమునునేనె వాసవాత్మజుడ
మునులలోపలవ్యాస మునినేనుసుమ్ము। 145
యాదవులందు నే సర్జునా నేను
పాండవులను నీవు ఫల్గునా నేను। 146
వేయి చెప్పగనేల విను మొక్కమాట
కాంతి విభూతియు ఘనతరోత్సాహ। 147
మే భూతమందైన నేపాటునేని
అదియెల్ల నా తేజమనుచు నీ వెఱుగు। 148
ఈ జగంబందెల్ల నేకాంశయుక్తి
వ్యాపకవ్యాప్యభావముల నే నుందు। 149
అనవినిహర్షించి యర్జునుండపుడు
నీయనుగ్రహమున నీయర్థంబు। 150

భగభగ మంను పావకరవిదీప్తి । 160

గలిగి తేజోరాశిగా చూడరాక

శంఖచక్రగదాది సాధనంబులను । 161

మకుటాంగదాదుల మండితంబగుచు

వెలుగు నీరూపిది విశ్వతోముఖము । 162

అఖిలలోకాధార, అవ్యయమూర్తి

శాశ్వత ధర్మరక్షక పరమాత్మ । 163

నివక్షరుండవు నిత్యుండ వజుడ

వని తలంచెద నిశ్చయంబుగా దేవ । 164

మంటికి మింటికి మధ్యంబునందు

అన్ని దిక్కులయందు వ్యాపించితీవు । 165

శశిసూర్యనేత్రంబు జ్వలనముఖంబు

బహువిధ ముగ్రరూపంబగు నీను । 166

నినువ్రన కదె దేవతల్ మ్రొక్కువారు

సిద్ధులు పొగడుచు చెలగుచున్నారు । 167

సురలుకొందఱు నిన్ను జొచ్చుచున్నారు

స్వస్తియనుచుఋషుల్ ప్రశంసచేసెదరు । 168

విస్మితులై నిన్ను వీక్షించువారు

వారదె రుద్రార్క వసుముఖ్యులెల్ల । 169

మిన్నంది వెలుఁగును మిఱుమిట్లుగొలుపు
కోఱల మిడిగ్రుడ్ల ఘోరవక్త్రములు। 170
గలనీదుభయదమహాకాయంబుజూచి
లోకంబుబెదరె నాలోదిగుల్గదిరె। 171
దిక్కుభ్రమించె నేదియు దోచదయ్యె
ధైర్యంబుచెదరె చిత్తముచంచలించె। 172
స్వామీ మహానుభావా దేవదేవ
నను దయజూడు మనాథరక్షకుడ। 173
ఉభయసేనలలోని యోధులందఱును
చొఱబాఱుచున్నారు చూడ నీనోళ్ల। 174
కొందలమందుచు కొందఱు నీదు
కోఱలనడుమ నల్గుచు నున్నవారు। 175
బిలబిల నీయందు వీరలు సొఱుట
జలధి నదుల్ చిచ్చు శలభంబులట్లె। 176
లోకంబులెల్ల నాలుక లట్టెచాచి
మ్రింగుచున్నా వందు మితిమేరలేదు। 177
ఓస్వామి నీతేజ ముగ్రమై జగము
కాల్చుచున్నదిదేమొ కరుణించునన్ను। 178
ఎవ్వరుమీరలో యెఱిగింపవయ్య

అని భీతి వణకుచున్నట్టి యర్జునుని । 179

గని స్వామి పలికెను గంభీరఫణితి

కాలంబు నేను లోకక్షయార్థముగ । 180

ప్రబలించి యున్నాడ రణరంగమందు

దనరెడి యోధులందఱు నీవుదక్క । 181

చచ్చెడువారె సంశయమేమిలేదు

ద్రోణభీష్మాదియోధుల నేను మున్నె । 182

చంపితి పగవారి జంపిన కీర్తి

నీకిత్తు రాజ్యంబు నీవు గైకొనుము । 183

అనవిని వణకుచు హరికి నర్జునుడు

కేల్మోడ్చి శిరమున గీలించి భీతి । 184

గద్గదకంఠుడై కరమర్థి పలికె

నీ మహిమముగన నేనెంతవాడ । 185

నీకీర్తి విని లోకనివహ ముప్పొంగె

భీతిచే రాక్షసుల్ పరెత్తెదరు । 186

ఆదికర్తవు నీ వనంత లోకేశ

వాయువు యముడగ్ని వరుణుండు శశియు । 187

బ్రహ్మదేవుండును ప్రపితామహుండు

నందఱున్నీవే మహాత్మా పరేశ । 188

నేయిమ్రొక్కులు నీకు వేవేలు దేవ
ఇటు నటు వెన్క ముందెల్లెడ మ్రొక్క 189
చెలికాడవని నిన్ను జేరి యోకృష్ణ
యాదవా సారథీ యని నీదు మహిమ। 190
తెలుగక వరుసకు నెగతాళికొఱకు
శయ్యాసనాటనాశనకాలములను। 191
ఎదుటనో వెనుకనో యేమేమిపల్కి
యపచరించితినో యవన్నియు మఱువు। 192
నాగిలపడి నమస్కారంబుచేసి
వేడెద గృపజూడనే నన్నుదీను। 193
కొమరుతప్పను తండ్రి కూర్చుకొన్నట్లు
సఖునితప్పు సఖుండు సర్దుకొన్నట్లు। 194
మగడు మానినితప్పు మన్నించునట్లు
నాతప్పు సైరించి నన్నేలుదేవ। 195
ఎన్నడుజూడని యీ నీదుమహిమ
నిప్పుడుచూచి నా హృదయ ముప్పొంగ 196
భయమున మనము సవ్యథమై కలంగె
మునుపటి నీ సౌమ్యమూర్తి నాకనులు 197
చల్లగా జూపవే స్వామీ యటన్న

అర్జునా నీయెడ ననురక్తివలన । 198
విశ్వరూపము నీకు వెలయ జూపితిని

యజ్ఞదానక్రియాధ్యయనతపంబు । 199
లెన్ని చేసిన నన్యు లీరూపుగనరు

ఈ ఘోరరూపంబు నీక్షించి నీవు । 200
భయమును మోహంబు వ్యథయును బడకు

హర్షింపుమని సౌమ్యుడై తోచెహరియు. 201
హరి యిట్లు సౌమ్యుడై యర్జునుతోడ

అనియె నాయందు నిత్యము చిత్తముంచి 202
అఖిలకర్మములు నా కర్పణచేసి

నన్నే ధ్యానించెడు నాభక్తజనుల । 203
మృత్యుసంసారవార్నిధినుండి నేను

ఉద్ధరింతును శాంతి యుక్తులజేసి । 204
కావున మనసును గట్టిగా నిలుపు

స్థిరముగా మదినిల్ప జేతగాకున్న । 205
అభ్యాసమున నన్ను నందంగగోరు

అభ్యసింపగ నేర నంటివయేని । 206
కర్మములన్ నాప్రీతిగా జేయుచుండు

అవియును చేతగా దంటేని యోగి । 207

నై కర్మఫలములత్యాగంబొనర్చు
అభ్యాసమునకన్న నధికంబు జ్ఞాన। 208
మంతకన్నను ధ్యాన మధికంబు దాని
కన్నను త్యాగమెచ్చగు దానికన్న। 209
నధి: మ్ము శాంతి; శాంతాత్ముడే సుఖియు
నా కతిప్రియుడు ద్వంద్వములేనివాడు. 210
అనవిని శ్రీకృష్ణు నడిగె నర్జునుడు
ప్రకృతి పూరుషుడు క్షేత్రంబు క్షేత్రజ్ఞ। 211
ననగ జ్ఞానంబు జ్ఞేయంబన నేవి?
వివరింపవే యన విష్ణు డిట్లనియె। 212
ఈ శరీరము క్షేత్ర మిదియెవ్వడెఱుగు
వాడె క్షేత్రజ్ఞుండు వాడెనేనౌదు। 213
ఈరెంటి వివరంబు నెఱుగుటే జ్ఞాన
మదిలెన్న మెఱిగింతు నర్జునా వినుము 214
పది యింద్రియంబులు పంచభూతములు
ఐదు శబ్దాదు లవ్యక్తంబు బుద్ధి। 215
మన సహంకృతి యనంబడు తత్త్వసమితి
జేరి యేర్పడునది క్షేత్రంబుసూవె। 216
క్షేత్రంబులందెల్ల జేరి తద్ధర్మ

కర్మగుణాగుణగతు లంటకుండ । 217
చూచువాడను నేను సూక్ష్మరూపుడను
జ్ఞేయంబు నేనె నే శేషింతు తుదను । 218
కార్యకారణముల కర్తయే ప్రకృతి
పురుషుండు సుఖదుఃఖ భోక్తయైయుండు 219
ప్రకృతిగుణంబుల రక్తుడై పురుషు
డొందు శుభాశుభయోనుల నెపుడు । 220
ప్రకృతిని పురుషుని పరిగ నెఱుంగు
వాఁ డుపద్రష్ట యీశ్వరుడు పరాత్మ । 221
అతనిని కొందఱు ధ్యానంబుచేత
అన్యులు సాంఖ్యయోగాభ్యాసమునను । 222
కర్మయోగంబున గనిదీక్షగొంద
అన్యులన్యులుచెప్ప నాలకించియును । 223
కనుగొందు రాతని గనుటయే ముక్తి
ముక్తుఁ డాకాశంబు పోలిక నెఱియు । 224
సంటక యొక్కడై యాదిత్యునట్లు
వెలిగించుచుండు నీ విశ్వంబునెల్ల । 225
ప్రకృతిని నిరసించు పరమసుజ్ఞాన
మెఱిగింతు వినుమని యిట్లనె మఱియు । 226

ప్రకృతిపూరుషసంగభవము జగఁబు
జగమున సత్త్వరజస్తమస్సులన। 227
ప్రకృతిగుణంబులు పరగును మూఁడు
సత్త్వంబు సుఖమును జ్ఞానఁబునిచ్చు। 228
పురుషుని తత్సంగమున గట్టుపఱచు
రజసు కోరికల గర్మఁబుల గిట్టు। 229
తమసు ప్రమాదనిద్రల గట్టుచుండు
ఇందు రెండణచిన హెచ్చు మూఁడవది। 230
మేని ప్రకాశ మీమేనిప కీళ్ల
నెసగినప్పుడు సత్త్వవృద్ధి నూహించు। 231
తలపులు పనులు యత్నఁబులు నాశ
లెచ్చినచో రజోవృద్ధి నూహించు। 232
మఱపు మోహము మందమతియు నిశ్చేష్ట
వెలసినచో తమోవృద్ధి నూహించు। 233
సత్త్వము హెచ్చిన సమయాన దేహి
మృతినొంద గాంచు నుత్కృష్టమౌ పదవి 234
రజసు హెచ్చినవేళ ప్రళయంబునొంద
సతతము జనించు కర్మాసక్తులందు। 235
తమసు హెచ్చినయట్టి తరుణంబునందు

బ్రుంగినవాఁడొందు మూఢజన్మంబు । 236

గుణకర్మసాక్షియై గుణములదాటి
నిలిచినవానికా నిర్వాణసిద్ధి । 237

నిశ్చలభక్తి నన్సేవించువాఁడు
గుణములుమూటి చిక్కునువీడితొలఁగు । 238

శాంతుండసంగుండు సర్వసముండు
అచలుఁడై వాఁడు బ్రహ్మత్వంబునొందు. 239

మఱియొక్క మాట సూక్ష్మం బిదివినుము
సంసార మశ్వత్థసమ మండ్రు బుధులు । 240

ఆచెట్టుమొదలు మీఁదై పరంబగుట
శాఖలు మహదాది సర్గంబుగాన । 241

క్రిందికి వ్యాపించురీతి నూహించు
ఆకులు వేదంబులన జెల్లుచుండు । 242

ఇది గుణంబులచేత వృద్ధినిబొందు
శబ్దాదులు చిగుళ్లు సాటియౌనెంచ । 243

దీని కాద్యంతముల్ స్థితియును లేదు
దీనిరూ పెవ్వరు తెలియఁగలేరు । 244

ఇదియెఱింగిన వారలే వేదవిదులు
దృఢమూలమైన యీవృక్షం బనంగ । 245

శస్త్రింబుచేత నాశంబుగావించి
చొచ్చిన మఱిరాని చోటుజేరంగ। 246
కోరికల్ ద్వంద్వముల్ గోసిన ఘనులు
యత్నింపవలయుమోహముమానముడిగి. 247
చంద్రసూర్యాగ్ను లెచ్చట వెలుగొంద
వదె మహాత్ములు పొందునట్టి పదంబు। 248
దేహేంద్రియాదుల దెలియుచునుండు
నాత్మ మనస్సుతో నాఱింద్రియముల। 249
నంటి శబ్దాదుల యనుభవంబొందు
గాలి పుష్పమునుండి గంధమున్వలెనె। 250
అవిగొంచువాడు దేహాంతరంబొందు
అట్లు దేహాశ్రయుండైన యాత్ముండు। 251
నేనెయం చెఱుగంగ నేరరు జడులు
ఎఱుగు యోగీశ్వరుం డీరహస్యంబు। 252
క్షరపురుషుండన సర్వభూతములు
సర్వహృద్గతుడౌ యక్షరపురుషుండు। 253
వీరలిద్దఱికంటె వేత్తైనవాడు
పురుషోత్తముడనంగ బొల్చు నీశ్వరుడు। 254
అక్షరక్షరపరాఖ్యల బొల్చునన్ను

ఎట్టి నాతడె కృతకృత్యుఁడగు జగతి । 255
అసురాంశజులును దేవాంశజులనఁగ
ఇరుదెఱంగుల నుందు రీభువి నరులు । 256
దైత్యాంశజులకు బంధంబె ఫలంబు
దేవాంశజులకు సిద్ధించు మోక్షంబు । 257
దైవసంపదనొప్పు ధర్మ్మ లహింస
సత్య మక్రోధ ము శాంతి త్యాగంబు । 258
మనసుమెత్తన యభిమానంబులేమి
ప్రాణులయెడ దయ పరిశుద్ధవృత్తి । 259
తేజంబు నోర్పును స్థిరబుద్ధి సిగ్గు
ధైర్యంబు గలిగిన దాంతులై యుంద్రు । 260
అసురాంశమున పుట్టినట్టి వారలకు
అజ్ఞానదంభదర్పాభిమానములు । 261
క్రోధపారుష్యముల్ రూఢిగానుండు
వారు నిరీశ్వరవాదులై యుంద్రు । 262
ఆశానిబద్ధులై యన్యాయముగను
ద్రవ్యమార్జించి దుర్వ్యయములొనర్చి । 263
కామభోగంబులే కడగాడలంచి
కడదాక చింతల కడగానలేక । 264

లోకకంటకులయి లోభమోహముల
జిక్కి యధోగతి జేరుచుందురు। 265
నరకలోకమునకు నరుల గొంపోవు
మార్గంబు లోభకామక్రోధమూడు। 266
మాత్మనాశకమిది యట్లౌటమనుజు
డీమూడు వర్జించి యేపారవలయు। 267
శాస్త్రంబువిడిచి యిష్టమువచ్చినట్లు
చనువారి కిహపరసౌఖ్యముల్ లేవు। 268
సంతుష్టిలేదు మోక్షంబునులేదు
చేయనౌనిది యునిచేయరా దనుచు। 269
నియమించు శాస్త్రమ్మునియమంబు తెలిసి
యుక్తమైనదె చేయుచుండగావలయు. 270
అనవిని యర్జునుండడిగె శ్రీకృష్ణ
శాస్త్రంబు విడిచియు శ్రద్ధానులగుచు। 271
చేయువారల నిష్ఠ చెప్పు మెట్టిదియొ
సాత్త్వికమో రాజసంబో తామసమో। 272
యీసంశయము దీర్పవేయన్న స్వామి
పలికె భూతముల స్వభావజంబైన। 273
శ్రద్ధ సాత్త్వికము రాజసంబనియు

తామసంబని త్రివిధంబగుచుండు। 274

పురుషులకెల్లను పూర్వసంస్కార

మునుబట్టి శ్రద్ధయు బుట్టుచునుండు। 275

ప్రీతి సేవింత్రు సాత్వికులు దేవతల

రాజసుల్ యక్షుల రాక్షసతతుల। 276

తామసుల్ ప్రేతభూతముల సేవింత్రు

అధికదంభమున నహంకారమునను। 277

కామరాగబలంబు గలిగి ఘోరముగ

తనువునందుండు భూతములను నన్ను। 278

గోడుపెట్టుచు నతికూరత నెవడు

శాస్త్రంబు చెప్పని సరణిని తపము। 279

గావించు వాడె రాక్షసనిశ్చయుండు;

మూడువిధంబులౌ భూతంబులకును। 280

భోజనయజ్ఞ తపోదానములును

మూడువిధంబులై మోదంబు నిచ్చు। 281

అనవిని క్రీడి సంన్యాసంబుత్యాగ

మను రెండిటియథార్థమది తెల్పుమనిన। 282

మధుసూదనుండు ప్రేమమున నిట్లనియె

మహిబుధుల్ కామ్యకర్మములమానుటను 283

సంన్యాస మందురు సర్వ కర్మముల
నగుఫలంబును మానుటని త్యాగమంద్రు। 284
కర్మంబు దోషంబు గలదిగా నెంచి
త్యజియించుటది త్యాగమని కొందఱంద్రు 285
ఇక నాదు నిశ్చయం బెఱిగింతు వినుము
యజ్ఞదానతపంబు లవి మానరాదు। 286
అవి పావనములు ఫలాసంగ మెడలి
చేయుచుండగవలె శిష్టులు వాని। 287
కర్మంబులే మానగాలేఁడు దేహి
తత్ఫలత్యాగియే త్యాగినాఁ జెల్లు। 288
కర్మముల్ మానిన గలుగు తత్ఫలము
ఫలమె మానిన దానిఫల మెట్లు గలుగు। 289
నే నను టే లేక నిజబుద్ధి కర్మ
ఫలము నంటక యేప్రపన్నున కుండు। 290
నతడు లోకములెల్ల హతము చేసినను
హంతయు బద్ధుఁ డావంతయు గాఁడు। 291
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులకు
స్వాభావికంబులు వర్ణింతు వినుము। 292
శాంతి దాంతియు క్షాంతి శౌచంబు తపము

త్రికరణశుద్ధి యాస్తిక్యంబు విద్య । 293
జ్ఞానవిజ్ఞానముల్ సహజంబు లగుచు
బరగుచుండును భువి బ్రాహ్మణావళికి । 294
శౌర్యధైర్యములు తేజము సమర్థతయు
రణమున స్థైర్యంబు ప్రభుత దానంబు । 295
క్షత్రియకోటికి స్వాభావికములు
సేద్య మావులనురక్షించుట బేర । 296
మాడుట సహజంబులగు వైశ్యులకును
పరిచర్య శూద్రస్వభావమౌ గాన । 297
తమతమ కర్మముల్ తప్పక చేసి
ధన్యులౌదురు పుణ్యాత్ములైన నరులు । 298
అగ్నిలో పొగవలె నన్నికర్మముల
దోషంబు లుండును దోషయుక్తమని । 299
సహజకర్మంబును చాలించరాదు
సహజకర్మమున దోషము నొందడెవడు । 300
మనసును నిలిపి కర్మఫలంబు విడిచి
ఆశలగోసి న న్నాత్మ భావించి । 301
నరుడొందు పరమౌ నైష్కర్మ్య సిద్ధి
ఇది శాస్త్రముల సార మిది రహస్యంబు. 302

జ్ఞాన విజ్ఞానవిధి సంక్షేపముగను
తెలిపెద నర్జునా స్థిరబుద్ధి వినుము ! 303
నిర్మలబుద్ధియై విజమానసంబు
ధైర్యంబుతోనిల్పి తనువంటవచ్చు ! 304
విషయంబులను మహావిషమట్లు రోసి
దేనిని గోరక ద్వేషించకుండ । 305
ఏకాంతమున నిల్చి యించుక తినుచు
వాక్కాయమానసవర్గంబు నాగి ! 306
వైరాగ్యయుక్తుడై పరమాత్ము నన్ను
ననవరతంబును ధ్యానించుకొనుచు । 307
నేను నాయది యను వృత్తుల జంపి
బలదర్పముల చిక్కుపడక కామాది । 308
వర్గంబు విడిచి నిర్వైరుడై శాంతి
నందినవాడు బ్రహ్మంబయియుండు । 309
బ్రహ్మమైనట్టి నిర్మల మానసుండు
సర్వభూతములను సమముగా జూచు । 310
వగవడు కోరడు వాడు నాయందు
స్థిరభక్తి నొందును శ్రేష్ఠుంబుగాను । 311
భక్తితో నాస్వరూపము గానవచ్చు

నా యథార్థముగన్న ననుబొందవచ్చు। 312

నాదయ దుఃఖసంతతి దాటవచ్చు

నామాట విననేని నశియింతు వీవు। 313

నే ననుకొనుచును నే జేయుననుచు

న్యాయమా పనిని మానగ జూచితేని। 314

స్వాభావికంబగు ప్రకృతిచే జిక్కి

యొల్లకుండియును జేయుదువదే వెనుక। 315

అఖిల భూతముల హృదంతరమొంది

యాడింతు బొమ్మలన ట్లవి నేను। 316

అన్ని భావముల నాయాశ్రయమొంద

నీకగు పరమశాంతియు నిత్యసుఖము। 317

విను సర్వధర్మముల్ విడువకనన్నె

శరణొందు నీ పాపసమితి హరింతు। 318

వగవకు మర్జునా పరమరహస్య

మిది నీకు జెప్పితి నితరు లభక్తు। 319

లశ్రద్ధధానులు నతపస్కు లీర్ష్యు

లివి వినదగనివా రెన్నటికైన। 320

ఇదియెల్ల వింటివే యేకాగ్ర బుద్ధి?

అజ్ఞానమును మోహ మణగెనే నీకు? 321

అనవిని యర్జునుం డలరి యోగేశ
నీదయవలన సందేహముల్ వాసె। 322

జ్ఞానంబుగలిగె నజ్ఞానంబు మాసె
నీవుచెప్పినయట్లె నే జేయువాడ। 323

అనియె శ్రీకృష్ణార్జునాత్మసంవాద
మెవరు విన్నను పఠియించినగాని। 324

వారికి కైవల్యపదము లభించు
జయ కృష్ణ శ్రీకృష్ణ జయ జయ కృష్ణ। 325

అనుచు కోపూరి పట్టాభిరామయ్యా
వనితల కతిసులభంబగునట్లు। 326

గీతార్థమంజరి కృతిచేసియిచ్చె
ఈశ్వరార్పితమయి యిది యొప్పగాక॥ 327

శ్రీకృష్ణార్పణమస్తు.



